ఉ. ఏమని యెన్నవచ్చుఁ గమలేక్షణుచేతలు నాకు నిచ్చటం
బ్రేమ నటించి పోయి పరభీరుత భీరుని నొయ్యఁ జేరి పో
రామి యొనర్పఁ జొచ్చె నుడురాజముఖి కనుఁగొంటె యింకఁ దా
నామెఁగ మెల్లఁ జూచుఁ*దగునా తన కీకపటప్రయోగముల్.

క. విరహాఖ్యానహేతుకం బగు విప్రలంభం బెట్టి దనిన.

ఉ. తానును నేను గూడి విరిదమ్మికొలంకులపొంతఁ బువ్వుతో
టానరసాలసాలములయొక్క లతాసదనంబులందు నిం
పూనఁగ సంచరించుగతు లుల్లమునందుఁ దలంపఁ బాడిగా
దే నళినాక్షుఁ డేల చనుదేఁడు సఖీమణి యేమిచేయుదున్.

వ. ప్రవాసహేతుకం బగువిప్రలంభం బెట్టి దనిన-

చ. మధురకు నేగుచుండి మధువైరికి నన్గొనిపోనఁ బాపమే
బుధనిధి యిప్పు డేల కొనిపోవు నటంచు మది న్వియోగతో
యధిఁ బడి గోపకాంత భయమందు; ముకుందుఁడు నవ్వధూటి యే
విధమునఁ దూలునో యని వ్రజవీథులనంచుఁ దలంచుఁ గూరిమిన్.

క. ఇట్టుల మఱియును సొన్నను, తద్గుణఁ గరుణాత్మకాభిధానం బన ర
మ్యట్టనుమానాఖ్యవియో, గమ్ము ననం గృతుల రెండుగతు లైయుండున్.

క. వనితపరోక్షంబునఁబతి,యును బ్రియుని పరోక్షమునఁ బయోజాక్షియు రో
దన మొనరించుట వర్ణిం, చినఁ గరుణాత్మకవియోగశృంగార మగున్.

—( ఉదాహరణము )—

చ. జగమునఁ బుష్పధామకము చంపెడి దయ్యును నాయురస్థలిం
దగిలి యిదేల చంపదు నితంబిని నేటికిఁ జంపెనో విషం
బగు నమృతంబు నొక్కసమయంబున నావిషము న్సుధారసం
బగు విధిచేత లిట్టివి గదా యని పొక్కు నజుండు నెవ్వఁగన్.

ఉ. ఎక్కడి కేగితే మదనయిందుఁడు గందఁడు శూలిచేత నిం
కెక్కడ నింత పుట్టు నని యేర్పడ నింత యెఱింగి యక్కటా
మక్కువ లుప్పతిల్లుటలు మాని శిలాప్రతిమావిమానతన్
మిక్కిలి వాసి గాదె తరుణీతరుణావలి నీవు లేనిచోన్.

క. మానిని పతియెడ నేమిట, నేని యతని గవియనొల్ల నే నని మిగులం
బూనినయునికికి వర్ణన, మానాఖ్యవియోగ మనఁగ మహిలోఁ జెల్లున్.

* దగు నాతని కీ-

ఉ. మానను యూఁది నేనతని మానితిఁ బొమ్మని పాసియున్నచోఁ
దానును మోసపుచ్చి సతతంబును గృష్ణుని తోడిగోష్ఠికి
న్మానస మేల పోవు తుది నన్నును బాదుగదల్చునో కదా
వానిచలంబె చెల్లు నని వందుఁ దళోదరి సంశయంబునన్.

వ. మఱి ద్వాదశావస్థ లెట్టి వనిన:

క. అరయఁగ శృంగారం బం, కురితము మఱి పల్లవితము కుసుమిత మనఁగాఁ
బరువడి ఫలితంబునునై, పరఁగు నవస్థాంతరములు పంద్రెం డగుచున్.

వ. కొందఱమతంబున దశావస లనియుం జెప్పు నవి యట్లుండెఁ గామశాస్త్రా
నుసారంబు లగుద్వాదశావస్థ లెట్టి వనిన చక్షుఃప్రీతి, మనఃసంగంబు, సం
కల్పంబు, ప్రలాపిత, జాగరఁబు, కార్శ్యంబు, అరతి, లజ్జాత్యాగంబు, సం
జ్వరము, ఉన్మాదంబు, మూర్ఛనంబు, చరమంబు నాఁ బరగు వీనిలక్షణం
బున కుదాహరణంబులు.

---

క. ప్రియు నాదరమునఁ జూచుట, నయనప్రీతియగు; మఱిమనఃసంగమగుం
బ్రియుచెనఁజిత్త మిడుట; ని,శ్చయముగఁ బ్రియువలనికోర్కి సంకల్పమగున్.

చక్షుఃప్రీతి కుదాహరణము—

చ. విమలకపోలభాగముల వెన్నెలనిగ్గులలీల మందహా
సములు నటింపఁ గన్గొనలచాయఁ దటిల్లత లంకురింప దే
హము హరినీలరత్ననివహద్యుతితోఁ దులఁదూఁగ సర్వలో
కము నలరించుశౌరిఁ బొడగంటి సఖీ ధ్రువపట్టణాధిపున్.

మనస్సంగతి కుదాహరణము—

చ. భ్రమరము కమ్మదేనియలు పాయలుగ్రోలుచుఁ దత్ప్రసూనగు
చ్ఛములఁ బ్రసక్తమై వెలయుచాడ్పున నాహృదయంబు చూచితే
కమలదళాక్షి యాదవశిఖామణిభవ్యగుణామృతప్రవా
హమున నె యోలలాడుచు నొకప్పుడు నన్నుఁ దలంప దేమియున్.

సంకల్పంబున కుదాహరణము—

ఉ. త్రిప్పులఁ బెట్టి నన్నిటు రతిప్రియుబారికిఁ ద్రోచి నెమ్మదిం
గొప్పునఁ గమ్మక్రొవ్విరులకు న్మధుపంబులు సందడింపఁగా
నొప్పులకుప్పయై ధ్రువపురోజ్జ్వలవీథులఁ గ్రాలుశౌరి నే
నెప్పుడు చూతునొక్కొ మెఱుఁగెక్కినచూపులు చొకళింపఁగన్.

---

క. వెలయఁగఁ బతిఁ గొనియాడుట, తలఁపఁ బ్రలాపిత; మనోవ్యథం బొరలుచుఁ గో
మలి కనుమూయమి జాగర, మలఁత తనుత్వంబు కార్శ్యమని యెడు పేరన్.

ప్రలాపిత కుదాహరణము—

చ. రసికుఁడు దానశోభి మధురప్రియభాషణశాలి సంతతో
ల్లసితముఖారవిందుఁడు కళానిధి సౌమ్యుఁడు యౌవనద్యుతిం
బసగలవన్నెకాఁడు ధువపట్టణనాయకుఁ డంచు జాణ లిం
పెసఁగఁగఁ బ్రస్తుతింతురు గదే యతఁ డేటికి రాఁడు నెచ్చెలీ.

జాగరమున కుదాహరణము—

చ. గిలిచితి నెట్టకేల కరిగెన్ దిన మంచు మదిం దలంపఁగా
నొలసినయీనిశాసమయ ముత్పలబంధునిఁ దెచ్చె వాఁడు వె
న్నెల వలవైచె మీఁద రమణీ మొరసె స్మరువింటినారి య
న్నలినదళాక్షుఁడుం దడసె నా కిటఁ గంటికి నిద్ర వచ్చునే.

కార్శ్యమున కుదాహరణము—

ఉ. నీదగుఁలీల యద్భుతము నీరజలోచనునంగుళీయకం
బాదట సందిదండ యగునా మహి నెవ్వరికైనఁ గానునుం
జేవ యనంగ దేహమును జేదగిలెం దుది నింక నీమనః
ఖేదము మాను మమ్మ యెఱిఁగించెద నింతయుఁ గైటభారికిన్.

---

క. వరుని దెస వేడ్క యుడుగుట, యరతి; నిజాచార మెడల నందినప్రేమ
స్థితి లజ్జాత్యాగ; మనా, స్మరపరితాపంబు పేరు సంజ్వర మయ్యెన్.

అరతి కుదాహరణము—

ఉ. కైరవబంధుబంధురవికాసవిలాసము లేల మందసం
చారిత నొప్పు నమ్మలయశైలసమీరము లేల యొప్పునీ
కీరముపల్కు లేల పరికింపఁగ నవ్వనలీల లేల శృం
గారము లేల నాకుఁ జెలి కంజదళాక్షుఁడు రాక తక్కినన్.

లజ్జాత్యాగమున కుదాహరణము—

చ. అలికులవేణి యేఁటి సమయంబుగఁ జేసిరి మున్ను భూమిలో
లలనల కెల్ల నీవది యలంఘ్యముగాఁగఁ దలంపుమమ్మ పూ
విలుతునిచేఁతలంగలఁగి వేఁ బోకత్రోవలఁ బోకుమమ్మ నీ
కులువడి చూడుమమ్మ కమలేక్షణుఁ దెచ్చెద నింతలోపలన్.

## తృతీయాశ్వాసము.

సంజ్వరమున కుదాహరణము—

చ. చెలులు ప్రయత్నపూర్వముగఁ జేయుచునున్నహిమోపచారముల్
తలఁపఁగ వమ్ముపోయెఁ బరితాపభరం బుడుపంగఁజాలు నీ
యలఘుచికిత్స యొండెఱుఁగ మచ్యుత నీకరుణామృతంబు పైఁ
జిలికి లతాంగికిం దనుపుసేయఁగదే యిదె నీకు మ్రొక్కెదన్.

క. చేతనము నచేతనము, న్నాతతముగ నేరదేని యది యున్మాదం;
బే తెలివియు లేనిది మూ, ర్ఛాతిశయము; చరమయత్నమది చరమమగున్.

ఉన్మాదమున కుదాహరణము—

చ. చెలులకు నేటికిం బ్రియముసెప్పఁగ నే నుదకంబు వోసి కో
మలముగఁ బెంచినట్టియెలమావికిఁ జెప్పినఁ బోయి రాదె పెం
దలకడ నొంటిఁ బో వెఱతుఁ దా నని పల్కినఁ దోడువంపనే
లలితలతావితానము నిలాధరుపాలికి దూతవృత్తికిన్.

మూర్ఛ కుదాహరణము—

చ అతులతపఃప్రభావమహితాత్ములకైనను గానరాని య
చ్యుతుఁడు లతాంగి నెమ్మనము సొచ్చి సుఖస్థితి నున్నవాఁడు నేఁ
డతని భజింతె మంచు శ్రవణాదులు దద్గతవృత్తి నుంట నా
యతివ సఖీజనంబు భయమందఁగ నున్నది నిశ్చలాకృతిన్.

చరమ కుదాహరణము—

చ. పడుచనొ పైదనో యలరుఁబ్రాయము నొందె యశోదనెయ్యపుం
గొడుకు భజింపలేని బ్రదుకున్ బ్రదుకా యది యేల నాకు మా
విడిచిగు రేమిఁబ్రాఁతి యుటమీఁదట వెన్నెల యెంత నవ్వున
న్నెడపు మనోజుఁ డేపఁగ సహింతునె బోటి యనాథచాన్వనన్.

క. చరమదెసకు లక్షణ మిట్టరసి యెఱుఁగవలయుఁ గాని యుచ్చో సతికిం
బురుషునితోడిసమాగమ, పరితోషము చెప్పవలయు భవ్యార్థముగన్.

ధన్యత కుదాహరణము—

చ. పవడమువీఁడఁ గస్తురి యిభస్ఫుటకుంభములందు నంకుశ
ప్రవిహితరేఖ లాదొరగువ భావజసూత్నసితక్షతంబు లీ
యువతికి భూషణస్ఫురణ నొప్పుచునున్నవి చూడరమ్మ మా
ధ్రువపురినాథుమన్ననఁ బ్రమోషతఁ బొందిన చిహ్న లన్నియున్.

---

వ. మఱి సంభోగవిశేషం బగు పంచవిధశృంగారం బెట్టిదనిన:—

క. శృంగారభంగు లైదు తె, ఱంగులు వాగ్విలసనంబు రహి నైపథ్యం
బంగక్రియ*సంకీర్ణము, సంగతముగ మిశ్రమనఁగఁ జనుఁ గంసారీ.

గీ. తలఁప వాగ్వృత్తి సంకీర్ణములును గ్రియలుఁ
బరఁగు నొక్కొక్కవిధము నైపథ్య మైదు
తెఱఁగులై యుండు మిశ్రంబు త్రివిధ మి
ట్లుద్దాతశృంగార మేకాదశాంచితముగ.

క. తనమదిఁ గలసంతోషము, వనజానన తాన చెప్ప వాగ్వృత్తి యగుం
దనచెయ్వులు నెచ్చెలులకు, ననయము గానంగనైన నది క్రియయయ్యెన్.

వాగ్వృత్తి కుదాహరణము—

క. కన్నులపండుగ సుమ్మీ, వెన్నుఁడు; తద్గుణచయంబు వీనుల కమృతం;
బెన్నఁగఁ దత్పరిరంభణ, మన్నిసుఖంబులకు నెక్కు డతివా నాకున్.

అంగక్రియ కుదాహరణము—

క. తొయ్యలిహరి కౌఁగిలిఁగని, పయ్యెదచనుఁగవకు మాటుపఱచుట తగుఁబో
అయ్యధరముపై నంగుళి, యొయ్యనఁ గదియించెఁ జూపకుండుట తగునే.

క. ఎందును నైపథ్యమునకుఁ, జందనభూషాంబరప్రసవములు వేర్వే
ఱొందుఁ జతుర్విధ మొక్కటి, యందంబుగఁ బంచవిధములై యటుజరుగున్.

అనులేపనశృంగారమున కుదాహరణము—

క. వనితకు హరియొనరించిన, నునుబూఁతలు మకరికామనోహరలిపులం
బసఁగలియుబాహాయుగళము, దనరును వలిపెంపుఱవికెఁ దాల్చిన భంగిన్.

ఆభరణశృంగారమున కుదాహరణము—

క. యువతీరత్నాభరణము, లవయవములఁ గీలుకొల్పి హరిపరిరంభో
త్సవవాంఛ నిడుద నిఱిచనుఁగవ నెపమున హారవల్లికలు కంఠమునన్.

వస్త్రశృంగారమున కుదాహరణము—

క. అలఘుకుచకలశయుగళము, లలితోరుద్వయము నుజ్జ్వలస్థితిఁ దనక
న్నులకింపొసఁగ వలయునని†, పొలఁతికిఁ గృష్ణుండు జిలుగుఁబుట్టముఁ గట్టెన్.

---

* వాగ్విలసనంబు నైపథ్యంబున్ అంగక్రియ- మూలము.

† కన్నులకింపొసంగ వలయునని తన- మూ.

మాల్యశృంగారమున కుదాహరణము—

క. హరికృతకుసుమసముంచిత, కరపదకటకంబు లమరెఁ గాంతకు నిందిం
దిరబృందవినదస్తుతులుం, కరణము లవి యప్రయత్నకలితము లయ్యెన్.

చతుర్విధశృంగారమున కుదాహరణము—

క. హరివేషము దనయంతః, కరణంబున కెంతప్రియము కాని సువర్ణాం
బరమును మకరకటకముఁ గస్తురియును వనమాలికయును సుదతిధరించెన్.

క. నైపథ్యము వాక్ప్రవృత్తియు, నేపారఁగఁ గ్రియయుఁ గూడెనే సంకీర్ణం
బై పరఁగు రెండురెండు స, మీపంబుల నిలిచెనేని మిశ్రము గృతులన్.

సంకీర్ణశృంగారమున కుదాహరణము—

క. దర్పణముఁ జూచి తిలకము, దీర్పఁగ నగవులకు వెరుకడెవ నిల్చినఁ దా
నేర్పడఁ గని సరసోక్తు లెల్లర్ప నతివ లేచి కుచములం బొదివె హరిన్.

నైపథ్యక్రియాత్మకమిశ్రమమున కుదాహరణము—

క. అభినవశృంగారముతోఁ, బ్రథగల జంబీరఫలము బాలకి చేతన్
రథసమున నందికొనియెద, విభగమనా మరునిశంక్రి కెనరేగెదవే.

వాక్ప్రవృత్తిక్రియాత్మకమిశ్రమున కుదాహరణము—

క. హరిమురళీనాదమునకుఁ, గరతాళధ్వనులు చెలఁగఁగాఁ గలకంఠ
స్వరములఁ బాడుచు నాడిరి, గురుతరమోదమున దివ్యగోపిక లెల్లన్.

---

వ. మఱి భావోదయాది చతుష్టయం బెట్టి దనిన—

క. తనరఁగ భావోదయమును, జను భావశమంబు భావసంధియు బుధసం
జన మగు భావశబలతయు, మునుకొని సంచారిభావములు దీపించున్.

ఉ. ఏ దఁట యొక్క భావ ముదయించు మనంబున నివ్విధంబు భా
వోదయ, ముద్భవించునది యొప్ప శమించుట భావశాంతి, స
మ్మోద మొగిన్ రసద్వయము ముట్టి జనించుట భావసంధి, ప్ర
స్తోదవిధేయ భావశబలత్వమగు న్బహుభావసూచనన్.

భావోదయమున కుదాహరణము—

క. తెలివాలికకన్నులక్రొ, మ్మెఱుఁగులుఁ గుచకలితయును మెచ్చులె హరికి
న్నెలమినై తాఁబేళ్లై, వలఱె నతం డనిన నింతి వదనము వంచెన్.

భావశాంతి కుదాహరణము—

క. పొలయలుకఁ జేసి భామకుడి, నొలసినకోపంబు చరణయుగళముపైఁ బా
ష్పములు నిలుపు ప్రియునిమదనా, కులత్వమునశాంతిఁబొందె గోపాంగనకున్.

భావసంధి కుదాహరణము—

క. అసురలపై దండెత్తిన, యసిశార్ఙ్గాయుధుని నిశ్చలాంగములను బెం
పెసఁగనుదయించెఁబులకము,లసమపటహనినదములఁ బ్రియావచనములన్.

భావశబలత కుదాహరణము—

క. నానోముఫలమునుమ్మీ, శ్రీనిధి నను జూచి సన్నసేసెఁ గులస్త్రీ
లీనీతి మెచ్చనేర్తురె, మానితిఁబో బ్రదుకఁ గలదె మదనునిచేతన్.

వ. మఱి రససంకరంబులు (ఎట్టివనిన)—

క. రసములు రెండొకచోట బె, రసి వచ్చిన నివ్విధంబు రససంకర మై
యెసఁగునుశృంగారముతోఁ,బొసఁగరసములిందుఁ*దెల్లముగరచియింతున్.

శృంగారహాస్యసంకరము—

క. కదలక తమాలపోతము, తుదిఁ గేగి వసించియుండఁ దొయ్యాలి కృష్ణా
బెదిరింపకు మెఱుఁగుమ మని, కదలక హరిపిఱుఁదముండి కలకల నవ్వెన్.

శృంగారరౌద్రసంకరము—

క. విహగాధిపుఁడు భామా, సహితముగ గృహీతపారిజాతోజ్జ్వలుఁడై
మహికి నరుదేర వెనుకొను, సహస్రనయనుఁగని కవిసె సక్రోధుండై.

శృంగారకరుణాసంకరము—

క. ఇఱిచనుగవలభరంబుల, నఱిగొనులు వడఁకఁ గాళియహ్రదముసతుల్
మొఱలిడుచు వచ్చి కృష్ణుని, యఱకాళ్లం దలలు మోపి రస్రులుదొరఁగన్

శృంగారవీరసంకరము—

క. నెఱికయు గనయముఁ బయ్యెద, చెఱఁగున బిగియించి విల్లు చేకొని సురల
దఱుఁ బొగడ నసురవీరునిఁ, బఱపుదు నని సత్యభామ బాణముఁదొడిగెన్

శృంగారభయానకసంకరము—

క. పడగలసర్పముపై నీ,కొడు కాడెడు నన్న నందగోపిక కడుఁద
ల్లడమునఁ బెదవులు దడుపుచు, వడఁకె బవనచలితకల్పవల్లియ పోలెన్

*రసము రెండు- పూ,

శృంగారాద్భుతసంకరము—

క. నున్నని తమాలలతపై, నున్నది గిరియుగము మీఁద నుడుపతి యటమీఁ
ద న్నిబిడతిమిర మనఁగాఁ, జెన్నగు వ్రజవనిత శౌరిఁ జేరి భజించెన్.

శృంగారశాంతసంకరము—

క. ధ్రువునకు దివిజయువతు లా, త్మవిలాసముఁ జూపవచ్చి తద్విమలతపః
ప్రవణంబున నందఱు వీ,తవికృతులై చనిరి పేదతరుణులపోలెన్.

రౌద్రబీభత్ససంకరము—

క. భ్రూలత ముడివడఁ జక్ర,జ్వాలలు నిగుడంగ నండజధ్వజుఁ డార్చెన్
గీలాలమాంసఖండకీ, పాలమయము చేసె నసురభటసైన్యములన్.

క. అరయంగ మఱియు రససం, కరము లిటులు విస్తరింపఁ గలుగును మహిన
ర్వరసాంతరములయందును, విరోధిరసమొకఁడు దక్క విస్రుతకృతులన్.

క. అప్రతిమం బగుశృంగా,రప్రకరణ మిట్లు భాసురం బయ్యె నితాం
తప్రౌఢి నొనర్చెద లో, కప్రీతిగ నింక నాయకప్రకరణమున్.

క. ధ్రువపురినాథుఁడు దివిజ, ప్రవరకిరీటతటరత్నరంజితనిజపా
దవిమలపీఠుఁడు భోగో,లవిభుఁడు రక్షించు మమ్ము లాలితకరుణన్.

గద్యము:-ఇది శ్రీవాణీవరప్రసాదలబ్ధ వాగ్విభవ తిక్కనామాత్యసంభవ సుక
విజనవిధేయ అనంతనామధేయప్రణీతంబైన రసాభరణంబునందు శృం
గారవిశేషంబులగు నవస్థాంతరముల విధంబులును ద్వాదశావస్థల విధం
బును బంచవిధశృంగారంబును భావోదయాదిచతుష్టయంబును రస
సంకరంబుల తెఱంగును శృంగారప్రకరణంబునన్నది తృతీయాశ్వాసము.

శ్రీరస్తు.

# ర సా భ ర ణ ము.

## చతుర్థాశ్వాసము.

---

క. శ్రీనాయకుఁ డఖిలధరి, త్రీ నాయకుఁ డగ్గణాది తేయముని శ్రే
ణీనాయకుఁ డీశ్రవనగ, రీనాయకుఁ డెలమి నాదరించును మమ్మున్.

వ. నాయకప్రకరణం బెట్టిదనిన, నాయకత్వంబు ప్రధాననాయకులు, సర్వరససాధారణనాయకులు, కేవలశృంగారనాయకులు ననంగాఁ ద్రివిధం బైపరఁగె నందుఁ బ్రధాననాయకుండు కావ్యాలంకారవ్యక్తుండు గావున వప్లండె నున్న యిరుదెఱంగుల వివరించెద.

—॥ సాధారణనాయకులు ॥—

క. ఎలమి నుదాత్తోద్ధతులన, లలితుఁడు శాంతుండు నాఁ గలరు నాయకు లి
మ్ముల ధీరపూర్వ లనువా, రలు నలువురు వారు సర్వరససామాన్యుల్.

అందు ధీరోదాత్తుఁడు——

క. భూరికృపామృతరసవి, స్తారుఁడు ధీరుఁ డతిసత్త్వధనుఁడు మహాగం
భీరుఁ డధికకథనుఁ డనఁగా, ధీరోదాత్తుండు సంస్తుతికిఁ బాత్రుఁ డిలన్.

ఉదాహరణము——

క. తనుఁ బొగడ సహింపఁడు శ, త్రుని నైనం దెగి వధింపఁ డొడఁగఁడు మదముం
గినుకయుఁ దోఁపఁగనీఁ డా, ననమునఁ గీర్తిసుభగుండౌ నర రఘుపతిదాన్.

ధీరోద్ధతుండు——

క. సులభక్రోధుఁడు మాయా, జలనిధినాయకుఁడు దర్పసామర్థ్యయుతుం
డిలఁ జాపవృత్తుఁ డనఁగా, వెలయును ధీరోద్ధతుండు విపులస్ఫూర్తిన్.

ఉదాహరణము——

క. రక్కసులు మీరు మీకుడు, రక్కసులై నిలిచి రిపుడు రామునిబంటుల్
చిక్కితిరి పొండనుచుఁ గపు, లక్కజముగఁ గెకపుమురు దశాస్యునిబంట్లన్.

ధీరలలితుఁడు——

క. వివిధకళానిపుణుఁడు సుఖ, నివహంబులతానకంబు నిశ్చింతుఁడు నా
వవనిఁ బచరించునాతఁ డ, లవునం బొగడొందు ధీరలలితుం డనఁగన్.

ఉదాహరణము—

చ. అనఘుఁడు ధర్మసూనుఁ డఖిలావనికిం బతియయ్యె మత్సుతుల్
సునిశితశస్త్రలాజిముఖశూరులు భారము లేదు నాకు నీ
యనిమిషభూరుహం బభిమతావహ మంచు వధూసమేతుఁడై
మనమునఁ జింత వంత యణుమాత్రము లేక సుఖించు శౌరిదాన్.

ధీరశాంతుఁడు—

క. ధీరుఁడు ప్రసన్నచిత్తుఁ డ,పారకృపాన్వితుఁడు నాఁగఁ బ్రస్తుతుఁ డగుపం
కేసుహాభవకులజనితుం, డారయఁగా ధీరశాంతుఁ డన విలసిల్లున్.

ఉదాహరణము—

క. హరిచేతఁ గుచేలత్వం, బరుదుగవీడ్వడియు సంపదాఢ్యుండై సు
స్థిరతఁ గని శాంతభావముఁ, బొరసి సుశీలుఁ డన విప్రపుంగవుఁ డొప్పెన్.

—॥ నాయకనాయికాప్రకరణము ॥—

క. ఒనరఁగ శృంగారరసం,బున కాశ్రయణంబు గాన బుధులెల్లను మే
లనునట్లుగ నొనరించెద, ఘననాయకనాయికాప్రకరణం బెల్లన్.

క. అనుకూలుఁ డనఁగ దక్షిణుఁ, డనధృష్టుం డనఁగ శఠసమాహ్వయుఁ డనఁగా
మును చతురత గలశృంగా,రనాయకులు వీరి నల్వురం దెలియనగున్.

అనుకూలనాయకుని కుదాహరణము—

ఉ. లేరె పదాఱువే లనఁగ లెక్కకు నెక్కిన రాణివాసముల్
శౌరికి వారితోఁ బ్రియము చాలఁగఁ గల్గుట సత్యభామకున్
భూరివిశేష మవ్వనితపుణ్యమొ చక్రికృపాసమృద్ధియో
యారయఁ బారిజాత మిల నన్యులకు న్నచుకూడ నేర్చునే.

దక్షిణనాయకుని కుదాహరణము—

ఉ. హారము లిచ్చె నాకుఁ జెలి యారతిరాజగురుండు నాకుఁ గ
స్తూరిక యిచ్చె నాకు మధుసూదనుఁ డుంగర మిచ్చె నాకుఁ గే
యూరము లిచ్చె నాకు జలజోదరుఁ డీపువుదండ నాకు శృం
గారరసేశుఁ డిచ్చె నని కౌతుకమందుదు రెల్లవ్రేతలున్.

ధృష్టనాయకుని కుదాహరణము—

చ. చను నెడపిన్నదాన ననుఁ జాయలు వల్కకు వేఁటసన్నమా
వనతరువల్లికాకుసుమవాసనగంధము కంటకాగ్రసం

జనితము లీ వ్రణంబులు ప్రచండపుకెండ చెమర్చుటల్ సతీ
ఘనముగ మోవి గందుట తగ న్విను శంఖరవం బొనర్పఁగన్.

శఠనాయకుని కుదాహరణము—

చ. చెలియ యిదేలొకో చెవియుఁ జెక్కు నెఱుంగక యుండ నిన్ననోఁ
బలికెను శౌరి యిట్లుగఁ బాడియె నొచ్చిన నోరఁ బల్కఁ డ
వ్విలసితమూర్తి నిన్ననొకవేళ హితంబుగ నొయ్యఁ బల్కుటల్
గలిగెనెయేని వెల్లవిరిగాఁ గలహించిన నాఁడ కే యొరుల్.

క. పరనాయకులకు నుచిత, స్మరలీల విటుండు పీఠమర్దనుఁడును నా
గరకుఁడు విదూషకుండును, నరయఁగ విశ్వాసు లగుసహాయులు ధరణిన్.

ఉ. మంచితనంబున న్విభుఁడు మానుగ నాయకునంతవాఁడె యొ
క్కించుక వెల్తి నాయకునహీనగుణంబులఁ బీఠమర్ది దా
మించుగఁ గూర్పవిప్పఁగలమిత్రుఁడు నాగరకుండు లీల న
వ్వించు విదూషకుండు గడువేడుక నాయకనాయికాదులన్.

క. నాయకులసలలితాభి,ప్రాయంబునఁ దత్సహాయభంగులు దెల్లం
బై యలరు నాయికలను స,హాయుల నటఁ దెలియవలయు నది యెట్లనినన్.

—౹ నాయికాలక్షణము ౹—

క. ధరణి స్వకీయ యనంగాఁ, బరకీయ యనంగ వెండి పణ్య యనంగాఁ
బరఁగుదురు మూఁడు తెఱఁగుల, వరసతియుఁ బరాంగనయును వారస్త్రీయున్.

చ. పెనిమిటి కిష్టమైనపని బ్రీతినొనర్చు నొకప్పుడేని తాఁ
బెనిమిటిమీఁది మాటలును బెన్నిటియిష్టముగాని యాత్రలో
నునుపదు సాధ్వి, వెండి ప్రియమొందును జారిణి జారుఁడబ్బినన్,
మును ధనమెల్ల మ్రింగి పెడమోమిడుఁ బణ్య విటుండు వచ్చినన్.

స్వకీయ కుదాహరణము—

ఉ. ఏ నడపాడుచుండఁగ నుపేంద్రుఁడ నీమటుఁడల్ సుమీ నిజం
గాని వచింప నొల్ల దని గారవ మొప్ప ముదంబ పల్కు లే
లా నిజమానె యంచు నను లాలనచేసిన భావమూర్తిలో
నే నలఁ దున్న పానుపున కేగడు వేళఁ దలంతునే సఖీ.

పరకీయ కుదాహరణము—

ఉ. అత్తయు నూర లేదు మగఁడా మఱిమందకుఁబోయి రాఁడు నే
నిత్తఱి నొంటి నుండు దని యేఁ జనుదెంచితిఁ గృష్ణరాయ నీ
చిత్తమెఱింగి మూలదెసఁ జీఁకటి దాఁచినదాన వెన్న గో
డొత్తననుండి యేల నను నూరకె చూచెదు తొంగిచూపులన్.

పణ్య కుదాహరణము—

ఉ. వేసరఁ డింక రాఁడొడఁగె వెన్నుఁడు నీవును నమ్మురాత్రిపైఁ
జేసితికూర్మి మాను మని చెప్పితిఁ జిల్కకుఁబోలె నెప్పుడున్
గాసి యొనర్చితే కుడువఁ గావిగొనం బడపెల్ల మాని నీ
వాసరసీరుహాక్షునకు నాలవుగా దొరకొంటె కూఁతురా.

క. మున్నొకని యధీనముగా,కున్న రమణి నొరులెఱుంగకుండ రమించున్
మిన్నక యెవ్వఁ డతని కా,కన్నియ పరకీయయట్లకా నెన్నఁబడున్.

ఉదాహరణము—

ఉ. కన్నియ నేను నన్నుఁ దమకంబున నేటికిఁ గొంగువట్టెదా
సన్నఘనక్షమాజముల చక్కిఁ జరించెద రల్లవారె మా
యన్నలు మానుమాను మని యల్లనఁ బల్లఁగ బుజ్జగించుచు
న్వెన్నుఁడు గోపకామిని నవీనసుఖాంబుధిఁ దేల్చె నేర్పునన్.

క. తొలితొలి ముగ్ధయనంగా, నలరిన మధ్యమయనంగ నటఁ బ్రౌఢయనం
జెలువగు యౌవనవయసునఁ, గలిగిన సంకేతనాయికలు మువ్వురొగిన్.

ముగ్ధ కుదాహరణము—

మ. హరిఁ జూచెం దరుణీలలామ నతవక్త్రాంభోజ యొప్ప న్నఖా
కర రేఖం బురణించుఫాలమున రంగద్భృంగసంఘాకృతిం
గురులాడం గ్రముకంబుల న్నిగుల వక్షోజాతముల్ వ్రీడయుం
దెరలోనిల్చు సువర్ణపుం బ్రతిమభాతి న్ముగ్ధభావంబునన్.

మధ్య కుదాహరణము—

మ. నడపొప్ప న్స్మరిపంబుతో నయనకోణంబు న్మెఱుంగెక్కఁగా
నొడువు ల్దోనెల నీనఁగా నులియఁ గానుండఁగె చన్దోయి మా
రెడుపండ్లం బెగడంగ నంటిన మురారిం జూచెఁ బ్రేమంబు గ
ప్పెడు సిగ్గు న్మఱి సిగ్గుఁ గప్పెడు మనఃప్రేమంబు సంధిల్లఁగాన్.

ప్రగల్భ కుదాహరణము —

చ. పొదుపై వృత్తనితంబ మొప్పఁగఁ గుచంబుల్ క్రొవ్వి యొండొంటితోఁ
గదియం గుంకుమపంక రేఖ నొసలం గన్పట్టఁ బ్రద్యుమ్ను ను
న్మదభద్రేభముభంగి బింకమునఁ గన్మందస్మితాలోకనం
బొదవం గృష్ణునిఁజూచె నిందుముఖి ప్రేమోత్సాహ ముప్పొంగఁగన్.

ప్రౌఢ కుదాహరణము—

మ. ధరనమ్రస్తనభారము న్విమలవక్త్రస్ఫూర్తియున్ రంజితా
ధరబింబంబును భ్రూలతానటన సౌందర్యంబు నుత్సంగగా
ఢరతాసక్తియు నూర్ధ్వసంగమనిరూఢత్వంబునుం గల్గు నం
బురుహామోదిని చూచెఁ గృష్ణు నసితాంభోభృత్సమశ్యామునిన్.

లోల కుదాహరణము—

మ. అలఘుశ్రోణియు లంబమానపృథుఘోరాకారము న్నాభిదే
శలుఠద్దీర్ఘకుచంబులున్ ఘటసదృక్షస్థూలతుందంబు నై
పలుమాఱు న్నిడుఁదీఁగెనవ్వు నగుచుం బాహాగ్రముల్సాఁచి చి
ట్టలు వెట్టు న్విటుమోముపై జరఠ కష్టం బిట్టిది స్వైశ్యయే.

గీ. బాల్యమునుయౌవనంబునుప్రౌఢతయును, లోలభావంబుగలపద్మలోచనలకు
డెందమునయందు నింపు పుట్టింపఁజాలు,నట్టివశ్యావిధానంబు లెట్టివనిన.

క. బాలకి మరగించుట తాం,బూలంబుల సురభిగంధపుష్పంబులఁ జి
త్రాలోకనభాషణముల, శాలీమృదులాన్నపాన సన్మానములన్.

ఉదాహరణము—

చ. కలపముగూర్చి మైనలఁదుఁ గమ్మనిపూవుల దోఁపుఁ గొప్పునన్
ఫలరసభక్ష్యభోజ్యములఁ బానములం బరితృప్తిచేయుఁ ద
మ్ములమిడుఁ జెక్కుటద్దముల మోవు ముఖాబ్జము కామతంత్రముల్
మెలపుగఁజూపుఁ బాయవశమే హరి నాయబలాలలామకున్.

క. హారంబుల నానాలం,కారంబుల వివిధసురతకౌశలముల ర
మ్యారామక్రీడల నిం,పారిన జవ్వనపుటింతి యలరుం బతికిన్.

ఉదాహరణము—

ఉ. హారము లున్నతస్తనములం దొడఁగూర్చు రచించుఁ జెక్కులం
గారము లంగకంబులఁ దగ న్వసలీలల నిం పొసర్చు వీ

నారుచిఁ జూపు నూత్నరతినైపుణభేదములం బెనంగు నీ
శౌరి లతాంగి యౌవనము సర్వము నీవిభుచేతఁ జిక్కదే.

క. మక్కువ లోఁద వెడిపలుకులఁ, దక్కరియలుకలను బహువిడంబంబులఁ బెం
పెక్కినసురతప్రచురతఁ, జిక్కుఁజుమీ ప్రౌఢయైన చెలువయుఁ బతికిన్.

ఉదాహరణము—

ఉ. మక్కువఁబల్కునాఁ దేనెలగు మాటలు పల్కు నహర్నిశంబు నో
క్కొక్క నెపంబుమై నలిగి యుగ్మలికిం దమకంబు తద్దయు
న్నిక్కిలిసేయు నొండొరుల మెచ్చని గాఢరతప్రవీణత
న్దక్కకచూపు శౌరి మిగులంగలదే మహినెట్టి ప్రౌఢయున్.

క. ప్రియములు పలికినఁ జాలును, నయమున నొక్కింత చూచినం జాలును స
న్నయచాలుఁ గరాంబుజముల, రయమున మిన్నంటు లోలరతిసౌఖ్యమునన్.

ఉదాహరణము—

చ. కనుఁగొనినవ్వు నాదరము గల్గినయట్టుల యంతికస్థలం
బున వసియింప వామకరపుష్కరసంజ్ఞయొనర్చు చిన్నకై
నను దలపెట్టు హాస్యవచనంబులు యాదవరాజుపాలి కే
మని చను లోల ప్రీతియగునా కడిపోయినపుష్ప మెయ్యెడన్.

---

సీ. ఇంక శృంగారనాయికలు నా నెనమండ్రు తెలియవలుగలరు స్వాధీనపతిక
వాసకసజ్జికాహ్వయ విరహోత్కంఠితాఖ్యాన విప్రలబ్ధాభిధాన
ఖండితోచితనామ కలహాంతరిత ప్రోషితప్రియ యభిసారికాప్రసిద్ధ
వీరు మన్మథుని దిగ్విజయలక్ష్ములు వీరలకు నాయకానుకూలంబునందు
వాసి దూతి బోటి దాదికూఁతురు పొరుఁగింటివనిత యొద్దియోని యొక్క
ముద్ర దాల్చియున్నముద్దియ శిల్పిని, స్వవశ తత్సహాయ లవనియందు.

క. పతిచేనెప్పుడు నుపలాలితయగు స్వాధీనపతిక; లెస్సగ సదన
స్వతనువు లలంకరించును, క్షితి వాసకసజ్జికాఖ్య చెలువునిరాకన్.

స్వాధీనపతిక—

క. మురహరునియురఃస్థలి సుస్థిరమై యవ్విభుసముల్లసితదరహాసిత
స్ఫురితవచనామృతాదులఁ, బొరయును సుఖియించుచుట్లఁ బొల్తురెవనితల్.

వాసకసజ్జిక—

క. హారిరాకకు నిచ్చలు మం, దిర మొప్ప నలంకరించు దేహమునం గ
స్తురి సురతరుకుసుమంబులు, సిరసునఁ దగ సత్యభామ చెలువగుచుండున్.

క. విరహోత్కంఠిత యనునది, వరునితడవు సైఁపలేక వగనొందు; నధీ
శ్వరుఁ డిక్కకు రాకుండిన, భరపడునది విప్రలంభ భావజుచేతన్.

విరహోత్కంఠిత—

క. మంద కడుదూర మాగో,విందుఁడు రాఁడేల యనుచు విరహాతురతం
బొంది యొకగోపకామిని, చందురుఁ గ్రోధించుఁ బ్రాణసఖులం దలఁచున్.

విప్రలబ్ధ—

క. సంకేతస్థలమునకుం, బంకజదృశుఁ డేలరాఁడు భయభీతుల నే
వంకఁ గరుణింపఁబోయెనొ, యింకేమన నన్నుఁదలఁపఁడే మదనార్తన్.

క. ఇతర దెస రాత్రి రతిచి,హ్నితుఁడగుపతి తేఁగని సహింపనియది ఖం
డితయగుఁ; గలహాంతరి తన,పతి నవమానించి పిదపఁ బరితప్త యగున్.

ఖండిత—

క. మనసిజశరహతమగు నా,మనసది నీకెఱుఁగరాదు మాధవ యారే
వను సోఁకిన మదనాయుధ,తనువ్రణముల నిపుడె చూపెఁ దాపముచాలన్.

కలహాంతరిత—

క. కోపించి జనార్దను నే,లాపక్షితి నపుడు పీనులకు నహితముగా
నోపడఁతి యిపుడు మదనుని, కోపము సైరింప నాకు గోచర మగునే.

క. ఒకదేశమునకుఁ దననా,యకుఁ డేగినఁ జిన్నవోవునది ప్రోషితభ
ర్తృక; నిలుపోపక ప్రియునొ,ద్దకుఁ జను నభిసారికాభిధాన తలంపన్.

ప్రోషితభర్తృక—

క. మధురకు నేగెం జెలియా, మధుమర్దనుఁ డింక నేఁడు మగుడుటయెపుడో
మధుమాసకీరకోకిల, మధుకరతతు లేపురేఁగి మదనుని గూడన్.

అభిసారిక—

క. అందెలు దొడిగితి నీవు ము,కుందునియున్నెడకు నరుగఁగోరి లతాంగీ
పొం దెఱుఁగ వేకచా నీ,కుం దెరువున నివియ త్రోడికొండ్రీలుసుమీ.

స్వాధీనపతిక కుదాహరణము—

చ. అలయక తీర్చుఁ గుంతలము లందముగాఁ దిలకంబు దీర్చుఁ బు
వ్వులు తుఱుమొప్పఁ బెట్టుఁ దొడవుల్ దొడుగు న్సకలాంగకంబుల
న్వలు వమరంగఁ గట్టు శుకవాణికి వేణుధరుండు కూర్మి ని
చ్చలుఁ జెలియా యిటేని దొలిజన్మమునం దిది యేమి నోఁచెనో.

వాసకసజ్జిక కుదాహరణము—

చ. సుదతి నిజాస్యదీధితులు సోఁకి కరంగువిహారగేహముల్
పొదలుశరీరవాసనలఁ బొంపిరివోఁవఁగఁ జేసె పానుపు
న్మృదువుగఁ జేసి క్రొవ్విరుల మేను నవీనవికాసలక్ష్మికా
స్పదముగఁ జేసె నీదగుప్రసన్నసమాగతిఁ గోరి యచ్యుతా.

విరహోత్కంఠిత కుదాహరణము—

ఉ. కోమలి కృష్ణుఁ డేమిటి కొకో తడవుండె నతండు సత్కళా
ధాముఁడు కావ్యగీతరసతత్పరుఁడై యట నిల్వఁ బోలు నేఁ
డే మియు లేదు నిన్నచటి కే మని పంపుదు వేఁడికొందు నా
కామునిఁ గన్నవాఁ డతఁడు గాన రయంబున వచ్చు వానిచేన్.

విప్రలబ్ధ కుదాహరణము—

ఉ. వ్రేతలఁ జిక్కులంబఱుపు వెక్కరికాఁ డిదె ప్రొద్దుపోయె సం
కేతనివాస మస్రల నొగిం ధనుపంబడియున్ దురాశ లే
లే తనలాగు గంటిమిగదే పద క్రమ్మఱఁ బోద మంచు న
బ్జాతదళాక్షి యీ రెలుఁగుపాటునఁ దూలుచుఁ జెప్పెఁ బోటితోన్.

ఖండిత కుదాహరణము—

చ. కొమరుఁడ రాత్రి యెక్కడనొకో విహరించితి నీకు నాకుఁ బ్రా
ణము లరయంగ నేకమని నన్నుఁ బ్రియంబున నీవు పల్కువా
క్యము నిజమయ్యె నీమొకలి యంగభవక్షతము ల్మదీయచి
త్తము నొగిలించె నంచు వనితామణి పల్కు నిశాటభంజనున్.

కలహాంతరిత కుదాహరణము—

ఉ. ఇచ్చు సురద్రుమంబు ప్రియ నేమని చెప్పినఁ ద్రోపుసేయఁ డే
య్యొచ్చెము లేదు శౌరిదెస నూరక నీ విట నెగ్గులాడి యీ

యచ్చునఁ గాముబారిఁ బడి తాహృదయంబు సహింప నేమిట
న్నెచ్చొరవరించు వానికని మిన్నక చింతిలు నింతి నెవ్వగన్.

ప్రోషితభర్తృక కుదాహరణము—

ఉ. మన్ననపాత్రుఁ డైన యభిమన్యునిపెండ్లికి నేఁగి యేలొకో
వెన్నుఁడు తద్దయుం దడసె వేమఱు నవ్విభురాక గోరి నా
కన్నులు నెమ్మనంబుఁ దమకంబున నాదెసయంద యుండు నిం
కెన్నఁడు వచ్చునో యని మృగేక్షణ బెగ్గిలుఁ గాముచేతలన్.

అభిసారిక కుదాహరణము—

ఉ. ఈలలి తేఁకుకోచులకు నీఁటుగఁ బూనితి మల్లెదండలు
న్మేలుగ వెల్లపుట్టమును నిర్మలమౌక్తికభూషణంబులుం
జాలవె నీరజోదరుని సన్నిధికిం జన నందె లేల కొం
డీలు పదస్థులైనఁ దరుణీమణి కార్యము దప్పకుండునే.

వ. తత్సఖీజనంబులగుణవిశేషంబు లెట్టి దనిన—

క. సారోక్తులు పలుకును సం,చారిక హితవృత్తిఁ బలుకుఁ జతురిక మధుర
స్మేరోక్తులు దగఁ బలుకును, సారిక మఱి దూతి పల్కు సంధానోక్తుల్.

వ. మఱి ధీరాధీరనాయికల తెఱం గెట్టి దనిన—

క. తలరన్ ధైర్యము మనమునఁ, గలిగినయది ధీరనాయికానామయగున్
వెలయును ధైర్యముచాలని, నలినవిలోచన యధీరనామక యయ్యెన్.

ధీరకుదాహరణము—

క. అలిగినఁ దీర్పక నే మా, ఱలిగి మనం బరయ ముకుళితాక్షుఁడ నైన
న్నలఁతుక తమకము వారియు, నెలయఁగ నిద్రించు భావ మే మని చెప్పన్

అధీర కుదాహరణము—

క. అలిగిన కోమలిఁ దీర్పక, తలఁపరయం గపటనిద్ర దాల్చిన మదిలో
నిలుపోపక చో టిమ్మని, వలిపెఁబుఁదున నొత్తి చనుఁగవం బ్రియునదిమెన్

గీ. ప్రియుని నోటలేక పెద్ద భర్జించును, నంతఁ బోక కలఁచు నాగ్రహముః
బరుష యనఁగఁ బరఁగు పంకజదళనేత్రి, యవ్విధంబు దగ నుదాహరింత

పరుష కుదాహరణము—

ఉ. మాపటివేళ బోటులసమక్షమునం బ్రియు బాహువల్లికల్
కోపమెలర్పఁ బట్టి ప్రియ కూటగృహంబున కీడ్చి బాష్పముల్

వైపయిఁ గ్రమ్మఁ దోట్రుపడుపల్కులఁ దప్పులు దెల్పి చెప్పి తి
న్నేపనికైన నోరి నిను నింక సహింపను నొవ్వ ప్రేయుచున్.

---

వ. మఱి యుత్తమమధ్యమాధమనాయికల తెఱం గెట్టి దనిన—

—। ఉత్తమనాయిక ।—

క. సముచితభాషణములఁ గో,పమురీతులఁ దత్ప్రసన్నభావంబుల ను
త్తమమధ్యమాధమాఖ్యను,లమరఁగఁ దెలియునది నాయికాంతర మెల్లన్.

క. తీపెసఁగఁ బ్రియను లాడును,గోపము వెలి దోఁపనీను గొనకొని దయితుం
డేపాటి ప్రియముఁ జెప్ప ను,హాోపప్రశమంబుఁ బొందు నుత్తమసతి దాన్.

ఉత్తమనాయిక వచనము—

ఉ. వేయునునేల నాథ నరవిందవిలోచన నీదరస్మిత
శ్రీయును నీసుభాషితవిశేషము నీవిలసత్కటాక్షముల్
నీయసమానరూపమును నీమహనీయగుణంబు మన్మనో
నాయక యస్మదీయజననంబు ఫలంబులు గావె యిన్నియున్.

ఆనాయిక కోపము—

చ. పలుకులఁ జెయ్వులం గమనభంగులఁ జూపుల నేవికారముం
దలఁకొననీక పూర్వగతి దప్పక యున్నవధూటి నిమ్ములం
బిలిచి నిజాంకపీఠమునఁ బెట్టి ముఖాబ్జముచూడ బాష్పధా
రలు దెలిపె న్మనోగతనిరంతరకోపముపేర్మి శౌరికిన్.

ఆనాయిక ప్రసన్నత—

శా. ఏతప్పు న్మను సేయ నిందువదనా యింతేల కోపంబు న
న్నేతన్మాత్రునిగాఁ దలంచితేఁట వే యేముట్టెద న్నీపదా
బ్జాతం బంచు నొకింత నమ్రుఁ డయినం బ్రాణేశ్వరు న్నేత్రసం
జాతాంభఃకుచకుంభసంఘటితభాస్వద్వక్షుఁ జేసె న్వెసన్.

—। మధ్యమనాయిక ।—

క. మునుకొని ప్రియమును నప్రియ
మును బెరయఁగఁ బల్కుఁ దెల్లముగఁ గోపము చూ
పును విభుని మ్రొక్కు గైకొని
యనుఁగై మఱి తేఱు మధ్యమాంగన ప్రీతిన్.

మధ్యమనాయిక వచనము—

ఉ. అక్కట నీకుఁ గూర్తు నని యెందఱుఁ బల్కఁగ నంతవట్టు నే
నిక్కము చేయఁబూని యొకనిం గనువిచ్చియుఁ జూడ నిట్లు నా
మక్కువ నీవెఱింగియును మానవు నీవెపత్రోవ లింక నే
చక్కనిదైన నోరి నిను సైఁపఁజుమీ కడు నొవ్వఁ జేయుదుర్.

ఆనాయిక కోపము—

గీ. మోవి యదర బొమలు ముడివడ నెఱ్ఱని
కన్నులెసఁగ నొడలు గంపమొదవ
నంగములు చెమర్ప ననుచితోక్తులు వల్కుఁ
జెలువఁ దేర్ప నెట్లు సేయుఁ బ్రియుఁడు.

ఆనాయిక ప్రసన్నత—

క. మ్రొక్కఁగవచ్చినఁ గాల్గొ,జక్కఁగ జాఁచికొని ప్రియునొసలుఁ మీఁగాల్గొం
దక్కక కదిపిన మదిలో, మిక్కుట సుగుకోపశిఖ శమించెం బ్రియకున్.

—॥ అధమనాయిక ॥—

క. పతిఁ గడవఁబలుకు నతఁ డవ, మతిచేసిన నలుక దక్కు మతి నూరక యా
నతుఁ డైనఁ దేఱ దతఁడు,ద్ధతుఁ డగుటయుఁ గ్రిందుపడు నధమకాంతధరన్.

అధమనాయిక వచనము—

క. ఏను బ్రియముఁ జెప్పినఁ గై,కోనేరవు కూళవిద్య కుదురై ప్రేవుల్
పూనముగఁ బల్కి నచ్చెను,సూనాస్త్రునిచేత ననుచు సుదతి యదల్చెన్.

ఆనాయిక కోపము—

క. పోనని పోదుం గనుఁగొన, నే నని కనుఁగొందుఁ గోప మెత్తినఁ దగునిం
కేనతని నొల్లఁబొమ్మని, పూనియ పైఁబడుదుఁ గూర్మి బుగ్గఁకఁ జెలియా.

ఆనాయిక ప్రసన్నత—

గీ. కాంతుఁ డలుక దీర్పఁ గాళ్లపై వ్రాలిన
గానివాని యనుచుఁ గాంత ద్రొబ్బఁ
వాఁడు గినిసి పోవ వడిఁ బాఱి పట్టు రా
కున్నఁ గాళ్ళమీఁద నొరగు వనిత.

## చాతుర్వర్ణ్యగృహిణులు.

క. చాతుర్వర్ణ్యోదితగృహి, ణీతిలకంబులకుఁ గలుగు నేరుపులును ద
జ్జాతివిశేషగుణంబులు, నాతతముగఁ దెలియవలయు నవి యెట్లనినన్.

క. గరగరికయు గాంభీర్యము, సరసోక్తులు గలుగుఁ గాని సద్ద్విజసతికిన్
సురతకళానిపుణత్వము, దొరకొన దెప్పుడును సిగ్గు దొడ్డవై యునికిన్.

క. బింకము చెలువును ధృతియుఁ గ, డంకయు మచ్చరము గలిగి డాసినచోఁ బ్రా
ణాంకునిదేవికి నెనయై, కొంకక విభుఁ గవయు రాచకోమలి గరిమన్.

క బుడిబుడిమాటలతఱచు, న్వెడబుద్ధులు మలినమైన వేషముఁ గడుఁ జొ
ప్పడియుండుఁ గాని కోమటి, పడఁతికి నేరుపులు లేవు పతిఁ గవయు నెడన్.

క. కమ్మలుఁ గడియము గాజులు, నమ్మడుఁగులుఁ జుక్కబొట్టు నమరఁగ రతితం
త్రమ్ములఁ బస గలిగి ప్రమో, దమ్ము పతికిఁ జేయు శూద్రతరుణి ధరిత్రిన్.

## మన్మథమాహాత్మ్యము.

సీ. శృంగారరాజ్యాభిషిక్తుఁ డుద్యత్కళాచతురుండు మన్మథచక్రవర్తి
యతనిపట్టపుదేవి రతిదేవి పువ్వులరథము వాహనము సారథివసంతుఁ
డాయుధ మిక్షుశరాసన మమ్ములు కమ్మగ్రొవ్విరులు కెంపైక్కొమ్మువాను
కలకంఠ శుక శారికామధువ్రతములు సేనలు దళవాయి సీతకరుఁడు
కృతకపర్వతారామ దీర్ఘికలయందు, విడిసి మలయసమీరుండు వేగుఁజూడ
నాకవిభునైనఁ గైలాసనాథునైనఁ, జెలఁగి సాధించు మర్త్యులఁ జెప్ప నేల.

క. చూత మశోకంబును జల, జాతము నీలోత్పలము నెసఁగువిరవాదిం
జేతోజాతునిబాణము, లాతఁడు సాధించు వీన నఖిలజగంబుల్.

క. కన్ను లశోకమునకు గుఱి, చన్నులు చూతమున కరుణసరసిజమునకుం
జెన్నుగ నురమది దిరిసెము, నున్నతమస్తకము యోని యుత్పలమునకున్.

క. కూడుడిగించునశోకము, వాడించును మల్లెవిరి వివర్ణతచేయుం
జూడఁగఁ జూతము తలఁపులు, జోడించును దమ్మి చంపిచూపుంగలువల్.

క. వినుతవచనరచనంబుల, ఘనతరముగ నిట్లు నాయకప్రకరణమిం
పున వివిధనాయికావ, ర్ణనసహితంబగుచు నూతనస్థితిఁ దనరెన్.

శా. జానొందన్ శకవర్షముల్ ఋతుశరజ్యావేందులై యొప్పన
య్యాత్మనందాబ్దమునందు మాఘమునఁ గృష్ణైకాదశీభౌమయు

క్తానామామృతవేళ నీకృతి యనంతార్యుండు సమ్యగ్రస
శ్రీనిండఁ ధ్రువపట్టణాధిపున కిచ్చె న్భక్తిపూర్వంబుగన్.

క. తలఁచిన తలఁపు ఫలించును, జెలు లగుదురు శత్రులైన శ్రీ గోడఁగూడుం
కలికాలదురితములు దుష్పలఁ దూలును ధ్రువపురీశు భాసురకరుణన్.

గద్యము—ఇది శ్రీవాణీవరప్రసాదలబ్ధవాగ్విభవ తిక్కనామాత్యసంభవ సుక విజనవిధేయ అనంతనామధేయ ప్రణీతం బైన రసాభరణంబునందు సాధారణ నాయకచతుష్టయంబుల తెఱంగును జతుర్విధనాయికా విశేషంబును దత్సఖసఖీభేదంబులును నాయికా ప్రకరణంబు నన్నది సర్వంబును
జతుర్థాశ్వాసము.

శ్రీరస్తు.

# ఆంధ్ర
# ధాతుమాల.




(పరిషత్పత్త్రికనుండి పునర్ముద్రితము)

---

కాకినాడ:
కాకినాడముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి
ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమునఁ
బ్రకటింపఁబడినది.

1930.



# ధాతుమాల.

ఈయాంధ్రధాతుమాలకు మూల మగువ్రాఁతకాగితపుఁబ్రతి శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటుకార్యాలయమునఁ గల చిన్నయసూరిగారి లిఖితగ్రంథసముదయములో దొరకినది. ఇది చిన్నయసూరికృత మగునో కాదో సిద్ధాంతముచేయుటకుఁ దగిన ప్రబలాధారములు దొరకలేదు. మేమువినినంతమట్టుకు సూరిగారిచే రచియింపఁబడిన వీక్రింది గ్రంథములై యున్నవి.

1. ఆంధ్రశబ్దశాసనము.
2. ఇంగ్లీషు లాచట్టముల భాషాంతరీకరణము.
3. చాటుపద్యములు.
4. రాణిగారిమకుటాభిషేకమునకు రచించినపద్యములు.
5. సంస్కృతబాలబోధ.
6. సంస్కృతసూత్రాంధ్రవ్యాకరణము (చిన్నయసూరీయము.)
7. ఆంధ్రశబ్దచింతామణివ్యాఖ్య.
8. బాలవ్యాకరణము.
9. నీతిచంద్రిక.
10. శబ్దలక్షణసంగ్రహము.
11. అక్షరగుచ్ఛము.
12. పద్యాంధ్రవ్యాకరణము.
13. విభక్తిబోధిని.
14. అకారాదినిఘంటువు.
15. విశ్వనిఘంటువు.
16. సుజనరంజనీపత్రిక.
17. ఆదిపర్వవచనము.
18. పచ్చయ్యప్పగారిపైఁబద్యములు.

ఈగ్రంథమందు గ్రామ్యరూపములు పెక్కులు కానఁబడుచున్నవి దీనినిబట్టి యిది చిన్నయసూరికృతము కాదేమో యనిసంశయించుట కవకాశము గలదు. ఎట్లయినను దెనుఁగులో ధాతుపాఠ మింతవఱకు లేదు కావున దీనిని బ్రకటించితిమి. ఇందలిగుణదోషములు విచారించుభారము పండితులదియై యున్నది.

దీనిపై విద్వాన్ కత్తి సాంబమూర్తి శాస్త్రిగారి యభిప్రాయము వెనుక వైపునఁ బ్రకటింపఁబడినది.

వే. ఆ.

శ్రీసరస్వతీపరదేవతాయైనమః

# ధాతుమాల-పీఠిక.

ఈయాంధ్రధాతుమాలను లోకమునఁ బ్రకటించి యాంధ్రసాహిత్యపరిషత్తు తనముఖ్యవిధి నొకదానిని నిర్వర్తించినది. సాధారణముగా గ్రంథనిబద్ధము లగుభాషల కెల్ల వ్యాకరణ ముండితీరును. ఏకాలమునం దేయేపదములు వాక్యములు నెట్టిపరిణామమును బొందినవో తెలుపుటయును బహుశిష్టజనవ్యవహారారాధకపదములు మాత్రమే ప్రయోగార్హము లని శాసించుటయే వ్యాకరణముల ప్రయోజనము. ఎల్లభాషలందును దొలుదొల్తఁ బరిమితము లగుక్రియాపదములు మాత్రమే యుండి యవసరముల ననుసరించి కాలక్రమమున నితరపదములకూడికచే నపరిమితము లగు నని కొందఱు పండితు లందురు. సంస్కృతభాషయందలి పదము లన్నియు ధాతుజన్యములే యని పాణినీయవ్యాకరణమునందలి వ్యుత్పత్తిపక్షము దెల్పుచున్నది. తెనుఁగుభాషయందలి కాలు చేయి కన్ను ముక్కు మొదలగుపదము లన్నియు ధాతుజన్యములే యని పలువురు పండితు లనుచున్నారు. కాని ధాతురూపములు నామములుగాఁ బరిణమించినవో నామములనుండి ధాతువులు జనించినవో నిర్ణయించుటమాత్ర మలవికానిపని. ఈసంశయ మాంధ్రభాషావిషయమున నత్యధికముగానే కలదు. నేను మేము నీవు మీరు వాఁడు వారు అను ద్వ్యక్షరసర్వనామములందలి ద్వితీయాపదములే ప్రకృతక్రియావిభక్తులుగా నగపడుచున్నవి. తొలుదొల్త ధాతువులకు విభక్తిప్రత్యయములు లేవనియు సర్వనామపదములే తత్తదర్థానుసారముగ ననుప్రయోగింపఁబడియెడి వనియుఁ గాలక్రమమున నయ్యవి వర్ణలోపాదివికారములఁ బొంది విభక్తులుగా మాఱెన వనియు నూహింప నగును. అయినను ధాతురూపములు మాత్ర మనాదిసిద్ధములై స్వతంత్రములుగానే యున్నవి.

ఏభాషయం దైనను బాండిత్యమునకు ధాతురూపపరిజ్ఞానము పరమసాధనముగా నున్నది. అనేకశబ్దము లుపసర్గసాహచర్యమునను బ్రకరణవశమునను భిన్నార్థద్యోతకము లైనను రూపసాదృశ్యముంబట్టి యేకధాతుజన్యము లని నిర్ణయించుచున్నాము. ప్రహారాహారసంహారవిహారపరిహారము లిట్టివి. ధాతురూపపరిజ్ఞానము లేనిభాషాజ్ఞానము నేత్రహీన మగుశరీరముం

పోలి నిరర్థక మగుచున్నది. పరిచిత మగు కరిపయ ధాతుకతిపయములతో నపరిమితము నావశ్యకము నగుపదజాలమును నిర్మించికొనుట వ్యవహారసౌకర్యమునం గూర్చును. కావుననే ప్రాచీనాంధ్రకవులు ధాతుమాలల రచించి యుండిరి. సంస్కృతమునకు ధాతుదశగణివలెఁ [illegible] వలని కానిది గదా! కర్ణాటభాషకు సైతము ధాతుపాఠము గలదు. ఆంధ్రభాషకు లక్షణముల రచించినవారు ప్రాచీనపవిత్రు లనేకు లున్నను నీకీరిగా ధాతువుల నెల్ల నేకసూత్రమున గుదిగ్రుచ్చి లోకమున కర్పించిన వారు సుకృహీకవామధేయు లగు శ్రీపరవస్తు చిన్నయసూరిగారు మాత్రమే. శ్రీసూరిగారిపై రతుకాసూ లగువాంధ్రు తెల్లరజిహ్వాగ్రములందును దాండవించుచునే యున్నవి. ప్రమాణమే కానిం డప్రమాణమే కాని మన బాలవ్యాకరణము బోలెఁ బటుతర మగు నాంధ్రవ్యాకరణ మాంధ్రావనియం దింకొక్కటి గలదా? చిన్నపొత్తమే యైనను నీతిచంద్రికం బోలు ప్రౌఢవచనకావ్యము వేఱొకటి లేదుగదా? ఈరెండు గ్రంథములును శ్రీసూరిగారి కీర్తిలతికకు శాఖాద్వయమై యాంధ్రదేశ కాయమానమున నలముకొని యనశ్వరజ్ఞానఫలము లందించుచున్న వనుట యతిశయోక్తి గానేరదు. శ్రీసూరిగారిజీవితచరిత్ర మిదివఱకే [illegible]పత్రికయందే ప్రకటింపఁబడినది. అచ్చుపడిన నీతిచంద్రికా బాలవ్యాకరణములు కాక యముద్రిత మగు నొకగొప్ప తెలుఁగునిఘంటువు సూరిగారు రచించినది శ్రీపీఠికాపుర సంస్థానమునఁ గలదు. శబ్దరత్నాకరముకంటె నిది మిగులఁ బెద్దది. శబ్దరత్నాకరమున కిది మూలప్రాయ మైనదికూడను. శబ్దలక్షణసంగ్రహ మను నొకముద్రితాంధ్రవ్యాకరణము సూరిగారు రచించినట్లు ప్రకటింపఁబడియున్నది కాని యది వారిచే రచింపఁబడినది కాదని నేను కళాకుశలమత్సభలో సిద్ధాంతీకరించియున్నాఁడను. ఇట్లుండ నిపు డీధాతుమాల యొకటి సూరిగారిపేరు మోసికొని లోకమున కవతరించినది. కావున దీనిఁ గూర్చి యించుక విమర్శింప వలసియున్నది.

శ్రీసూరిగారు ధాతుమాల నొకదానిని రచించినట్లనేకు లెఱుంగరు. ఈగ్రంథమునం దెక్కడను సూరిగారిపేరు లేదు. శ్రీసూరిగారిమతమునకు విరుద్ధ మగు ననేక విషయము లిందుఁ గలవు. అలాక్షణికత్వమును నిరసించువారిలో సూరిగా రగ్రగణ్యు లనుట నిర్వివాదము గదా? అట్టిసూరిగారు గ్రామ్యరూపముల నుదాహరింతురా? ఒక వేళ వ్యుత్పత్తికై గ్రామ్యపద

ములతో నర్థనిరూపణము గావించినఁ గావింపవచ్చును గాని ధాతువులకే
గ్రామ్యరూపముల నుదాహరించుట వాని యర్థములను సంస్కృతమున నాంధ్రమున
ను దెల్పుటయును శ్రీసూరిగారివంటి యభినివేశము లాచరింతురా? "ధాత్వా
దులకు ధాత్వాదు లనుప్రయుక్తంబులై వివక్షితార్థాభిధాయకంబు లగు
నయ్యవి శబ్దపల్లవంబులు నాఁబరఁగు." అని సూత్రించి సూరిగారు ఏగుదెం
చు, చనుదెంచు, మేలుకొను, అంకిమ్ము, చొత్తెంచు మొదలగురూపములను
సాధించిరి. కినియాం దవయవద్వయము వేర్వేఱ స్వతంత్రప్రయోగము గలది
యే. ఈ గ్రంథమునందు అగపడు మొదలగురూపములను సమాసధాతువులుగాఁ
బేర్కొని అగపడులో అగకు వ్యస్తప్రయోగము లేదనుట సూరిగారిమతమున
కు విరుద్ధముగాదా? సమాసధాతుసంజ్ఞ సూరిగారిగ్రంథమునం దెక్కడ నగ
పడదు. సమాసధాతువు లను సంజ్ఞాకరణమే దుష్టము. ప్రయోగారూఢము
లగుదేశ్యధాతువులకు మాత్ర మర్థనిరూపణము రూపనిష్పత్తియుఁ గావించు
ట గ్రంథోద్దేశమయి యుండఁగా నిందు వ్యావహారికములఁగూడ నుదాహరించి
యుండుఁ గొన్నింటికి మాత్రము గ్రామ్యము లని "గ్రా" సంజ్ఞతో సూచన
గావింపఁబడినది. సూచనావిరహితము లయ్యు గ్రామ్యము లనేకములు గలవు.
మఱియు ననేకవిధము లగుదోషము లీగ్రంథమునం దగపడుచున్నవి. వాని
నీమస్త్రాత్రముగ నీసారికి నుదాహరింతును.

అగపడు, అగుపడు- ఆమతించు, ఆమెతించు- ఎదగు, ఎదుగు- ఎదిర్చు,
ఎదిఱ్చు, ఎదిరించు, ఎదుర్కొను- ఓదార్చు, ఓదర్చు- తడవు,తడువు, తపుడు-
తపుడుకాదు, మొద లగురూపాంతరము లడుగడుగునఁ జూపఁబడినవి. కాని
యిందలిరూపాంతరములును శకటరేఫసంయోగములును గ్రంథములం దెక్కడ
ను గానరావు, కొన్ని వ్యవహారమందును మృగ్యములే. ఓటించు-ఓట్రించు;
కతకు-కతుకు, కదకు-కదుకు, తపుడు-తపుడుకాదు, మట్టగించు, మద్దటిలు-
మద్దటిలు, లోటు, లోడు అను రూపాంతరములే ప్రదేశమం దేవి వ్యవహారసిద్ధ
ములో నాకెఱుఁగినంతవఱకుఁ దెలియరాలేదు.

అర్థనిర్ణయమునందు ననేకదోషము లున్నవి. ఆమెతించు-సత్కారపూర్వ
కముగాఁ బిలుచుట, విందుచేయుట యగునేమో! క్రుచ్=కాంక్షించుట.(మట్టు
కొనుట శ. ర) అవు మొదలగునవి పొడుచుట క్రుమ్ము కాని కుమ్ముకాదు. దు
య్యానకు బాణము దూసిపాఱుట కాని పిడికిలినుండి జాఱుట కాదు. ఒకవేళ

పీఠికనుండి విడుచుట యగునేమో ? కతకు మొదలగు నాల్గురూపములకు భోజనసామాన్యమే యర్థమైనను శునకాస్వాదనమే యని నియమించుట సరి కాదు. రాపాను దోషమారోపించి తెల్పుటెంత ? వంచివేయుటకు కల్పించుట ప్రసిద్ధము. ద్రవపదార్థ మొలికించుట గ్రామ్యము. ప్రకృతిప్రత్యయ నిరూపణమందును దోషము లగపడుచున్నవి. అఱు-అఱచేతితోఁ గొట్టుట యనుచు వర్తమానార్థక ప్రత్యయము నని తెలుపుట తప్పుగాదా ? ఔడుగఱములో ఔడుగఱ ధాతువంట, చు వర్తమానార్థక ప్రత్యయమంట. ఇంతటి వైపరీత్యమెందైనఁ గలదా ?

వ్రాఁతప్రతియందు ధాతువు, సంస్కృతార్థము, ఆంధ్రార్థము, వర్తమాన భూతభావికాలికప్రత్యయములు, విశేషములు నని యేనువిభాగములు ప్రదర్శింపఁబడినను, ముద్రణమున ధాతుధాత్వర్థములు మాత్రమే ప్రకటింపఁబడినవి. అన్నిధాతువులకు వర్తమానమున చువర్ణకమును భూతమున ఇత్-ఇన్ వర్ణకములును, భావిని ఎద్, ద్ వర్ణకములును దెలుపఁబడినవి. విశేషములందు సమానధాతువులు, శాస్త్రీయములు, అస్వతంత్రములు మొదలగువిషయములు పేర్కొనఁబడినవి. అన్నింటికిని జివర డుము ప్రత్యయముతో నర్థము నిరూపింపఁబడినది.

పైయంశము లన్నింటి నాలోచించినచో బరిషత్తువారు ప్రకటించినది చిన్నయసూరికృతమేనా యనుసంశయము గలుగుట సహజము. చిన్నయసూరివంటి లాక్షణికశిరోమణిగ్రంథమం దిట్టిదోషఁగులు పొసంగునా యను శంక దుర్నివారమే యైనను గొంచె మాలోచింపఁదగును. శ్రీమత్సూరిగారు ధాతుమాల నొకదానిని రచించి రనుటలో నెట్టిసంశయమును లేదు. చెన్నపురిప్రాచ్యలిఖితపుస్తకాగారమున నొకధాతుమాల చిన్నయసూరివిరచిత మగునది యుండెడిది. ఆపుస్తకము నెవ్వరో యపహరించినను దానివరుససంఖ్యయుఁ జేకను నిప్పటికిని గలదు. పరిషత్తునకు లభించినప్రతి శ్రీసూరిగారి స్వహస్తలిఖితము కాదు. వారిప్రతికిఁ బుత్రికయో పౌత్రియో యింకనువ్యవహితసంతతియో తెలియదు. ప్రతులఁ జూచి పుత్రికల వ్రాసికొన్నవారు తప్పుల దొరలించుట వింత కాదుగదా! శ్రీసూరిగారిగ్రంథములు చాల నీనడుమఁ బరిషత్తువారికి లభించినవి. వానినెల్లఁ జూచిన నీవిషయము సత్యమే యని తేలును. లోకములో వ్రాఁతతప్పులు పడుట సైజమే కాని ప్రక్షిప్తము లధికము

గాఁ దూటుట శ్రీసూరిగారి గ్రంథములకు సంభవించిన మహోపద్రవము. వారియందు గౌరవాతిశయమునఁ దమరేమో సాధించితి మనుతలంపున మంచిచెడ్డలారయక యథేష్టమైనగడ్డి నెల్ల గ్రంథమందుఁ జొప్పించుట శ్రీసూరిగారి గ్రంథములం దధికముగా నగపడును. అట్టిచీకాకులు లేకున్న నీధాతుమాల కెంతటిగౌరవము నొందెడిదో? ఇదియే కాక శ్రీసూరిగారి గ్రంథము లముద్రితము లేవియైనను మనకు నిర్దుష్టముగ లభించుట దుష్కరమే. ఎట్లయినను నేను ప్రారంభమునఁ జేర్చియున్నంత యుపయోగ మిప్పటియీగ్రంథమునకు లేకున్నను దీని కవసరము గలదనియే నావిశ్వాసము. గ్రామ్యములో గ్రాంథికములో యగుధాతువుల నొక్కచోఁ జేర్చి వానియర్థము నిరూపించుట వ్యుత్పత్సువుల కత్యంతోపకారకముగదా? అందును గ్రామ్యరూపముల వలన భిన్నదేశవ్యవహారము సుగమ మగును. కావున నీధాతుమాలను బ్రకటించి యాంధ్రసాహిత్యపరిషత్తు మహోపకార మొనరించె ననుట కావంతయు సందేహము లేదు.

నరసన్నపేట, గంజాము.<br>20-1-1930

కత్తి సాంబమూర్తిశాస్త్రి.

# ధాతుమాల.

## అ

| ధాతువు | సంస్కృతార్థము | తెలుఁగర్థము |
|---|---|---|
| అక్కళించు | కుక్షినిమ్నీకరణే | *స కడుపుపల్లముచేయుట |
| అగలు | విదారణే | అ పగులుట |
| అగ్గించు | స్తుతౌ | స స్తుతియించుట |
| అంగలార్చు | దైన్యరోదనే | అ దైన్యముగా నేడ్చుట |
| అగపడు, అగుపడు | దర్శనవిషయే | అ దృశ్యమవుట |
| అగ్గపడు | అధీనతాప్రాప్తౌ | అ అధీనత్వమును పొందుట |
| అగ్గలించు | దుస్సహాధిక్యే | అ వెక్కసమవుట |
| అచ్చ్ | ఆధమర్ణ్యే | స అప్పుపడుట |
| | అన్యాయదానేచ | అ అన్యాయముగానిచ్చుట |
| అంటు | స్పర్శే | స తాఁకుట |
| | సంశ్లేషణే | అ రంగు మొదలైనది వస్త్రాదులనంటుట |
| | అభ్యంజనే | స అభ్యంగనము సేయుట |
| అటమటించు, అటమరించు | వంచయిత్వాహరణే | స వంచించి హరించుట |
| † అటకాయించు, అడ్డగించు | నిరోధనే | స నిరోధించుట |
| అడఁగు | నాశే | అ నశించుట |
| | వినయేచ | అ వినయము పొందుట |
| అడుగు | యాచనాయాం ప్రశ్నేచ | స యాచించుట, ప్రశ్నసేయుట |
| అడుగుకొను, అడుక్కొను | సాంత్వనాయాం | స సాంత్వనసేయుట |
| | స్వార్థయాచనాయాం | తనకైయాచించుట |
| | స్వార్థప్రశ్నేచ | తనకై ప్రశ్నసేయుట |
| అడు | తలప్రహారే | స అఱచేతఁ గొట్టుట |
| అడిచిపడు | అత్యౌద్ధత్యే | అ మిడిసిపడుట |

* స సకర్మకము. అ అకర్మకము.

† గ్రామ్యము = మ్లేచ్ఛము.

| ధాతువు | సంస్కృతార్థము | తెలుఁగర్థము. |
|---|---|---|
| అడరు | ప్రకాశే | అ ప్రకాశించుట |
| అడరించు | ప్రయోగే | స ప్రయోగించుట |
| అడలు | ఉచ్చైరోదనే | అ గట్టిగా నేడ్చుట |
| | భయే చ | భయపడుట |
| అడుగంటు | అధోగమనే | అ క్రిందికిఁబోవుట |
| | అన్నాదివిదాహే చ | అన్నాదులడుగుమాఁడుట |
| అడ్డపడు | ప్రతిబంధే | అ ప్రతిబంధక మవుట |
| | తిర్యక్పతనే | అడ్డముగాఁ బడుట |
| | దర్శనప్రతిబంధకతయాంతరా వస్థానేచ | చూడవలసినవస్తు వగుపడకుండ నడుమనుండుట |
| అణఁగు, అణుగు | నాశే, వినయే | అ నశించుట, వినయముపొందుట, క్రుంగుట |
| | అధోవసర్పణేచ | |
| అణవరించు | బుద్ధికరణేనపోషణే | స బుద్ధిచెప్పి పోషించుట |
| అతుకు | సంయోగే | అ కూడుట |
| అదుకు | సంయోజనేచ | స కూర్చుట |
| అద్దు | ఉందనే | స నీళ్లలోఁదడుపుట |
| | వస్త్రాదిరంజనేచ | అద్దకము వేయుట |
| అందు | ప్రాప్తౌ | స పొందుట |
| | విప్రకృష్టస్యస్పర్శయోగ్యతాయాంచ | అ చేతముట్టఁదగుట (దూలమందెనని) |
| అందుకొను | గ్రహణే | స గ్రహించుట |
| | విప్రకృష్టస్యస్పర్శనేచ | చేతముట్టుకొనుట (దూలమందుకొను) |
| అందగించు | అలంకారే | అ అందమగుట |
| | పరోక్తిసంయోగే | అ ఒకనిమాటలోఁ గలసికొనుట |
| | అలంకరణేచ | స అందముచేయుట |
| అదుము | అధఃప్రాపణే | స క్రుంగఁజేయుట |
| అదరు, అదురు | కంపనే | అ కంపించుట |
| అదరిపడు | ఆకస్మికకంపనే | అ ఆకస్మికముగఁ గంపించుట |
| అదల్చు, అదలించు, అదిలించు | పశ్వాదినివారణే | స పశ్వాదులను దోలుట |

| ధాతువు | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|
| అవు | చలనే | అ చలించుట |
| అను | ఉక్తౌ | స చెప్పుట |
| అనుపించుకొను<br>అనిపించుకొను | ఉక్తే | అ చెప్పఁబడుట |
| అనుకొను | స్వయమనుసంధానే | స తనలోఁదాను దలఁచుట |
| అనఁగిపెనఁగు | సంవాసేన స్నేహంసంపాద్య కార్యేషుసహప్రవృత్తౌ | అ సహవాసముచేతస్నేహము సంపాదించుకొనియొకనితోఁగూడ బనులయందుఁబవర్తించుట—అన్యోన్యప్రీతిగానుండెననుట. |
| అనుచు, అనుపు<br>అంపు, అంపించు | ప్రస్థాపనే<br>ప్రేషణేచ | స పంపించుట |
| అప్పళించు | ఆస్ఫాలనే | స భుజములుమొదలైనవి చఱచుట |
| అప్పగించు | అర్పణే | స ఒకనివశముచేయుట |
| అబ్బు | లభ్యతాయాం | అ లభ్యమగుట |
| అమ్ము | విక్రయే | స విక్రయించుట |
| అమరు<br>అమురు | శోభాయాం<br>సిద్ధౌచ | అ శోభించుట<br>సిద్ధించుట |
| అయిదుపదిచేయు | పరాగతౌ | అ వెనుకదీయుట |
| అరుగు | గతౌ | అ పోవుట |
| అరుగుదెంచు<br>అరుదెంచు | ఆగమనే | అ వచ్చుట |
| అరయు | విచారణే<br>మార్గణేచ | స విచారించుట<br>వెదకుట |
| అరికట్టు | నిరోధనే | స నిరోధించుట |
| అఱు | నాశే<br>హైన్యేచ | అ నశించుట<br>తెగుట |
| అఱుగు | జీర్ణతాయాం,లోహాదీనాం ఘర్షణేన హైన్యేచ | అ జీర్ణించుట, లోహాదులు తోముట మొదలగువాని చేతఁ దగ్గిపోవుట |

| ధాతువు | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|
| అఱచు, అఱుచు | ఉద్ఘోషే. | అ ఉద్ఘోషించుట |
| అలుపు | గృహాదిషు కృత్యాయాసాం, లబ్ధ్వాయాసాంచ | అ పట్టుకొనుటకుఁ గృత్యము వుట్టుట చేతికి అలుపుట, దక్కుట |
| అలుపుకొను | ప్రాప్తస్యజీర్ణీకరణే | స ప్రాప్తమైనదానిని జీర్ణము చేసికొనుట |
| అలాము | ఆక్రమణే | స ఆక్రమించుట |
| అలుకు | గోమయాదిలేపనే | స పేడ మొదలగువానిచే లేపనము సేయుట |
| అలుగు | రోషే. | అ రోషము పొందుట |
| అలంచు | పీడనే | స పీడించుట |
| అలందు | చర్చనే | స గంధము మొదలైనవి పూసికొనుట |
| అలంపురు | దుఃఖే | అ దుఃఖపడుట |
| అలము | వ్యాప్తౌ | స వ్యాపించుట |
| అలయు, అలియు | శ్రాంతౌ | అ శ్రాంతుఁడగుట |
| అలరు | వికాసే, సంతోషేచ | అ వికసించుట–సంతోషించుట |
| అలవడు | అభ్యస్తే | అ అలవాటుపడుట |
| అల్లాడు<br>అల్లల్లాడు<br>అల్లనాడు | అనవలంబస్పందే | అ అవలంబనము లేక కదలుట |
| అళుకు | భయే | అ భయపడుట |
| అల్లు, అల్లు | అన్యోన్యగ్రథనేన నిర్మాణే | స అల్లికగా నిర్మించుట, చాప యల్లెను |
| | లతాదిప్రసరణేచ | అ తీఁగ మొదలైనది ప్రసరించుట |
| అవు | భవనే | అ అవుట |
| అవియు<br>అవిఁయు | రూపపరామర్శే | అ రూపు చెడిపోవుట |
| అవుడుగఱచు | క్రోధేనోష్ఠదంశనే | అ కోపముచేతఁ బెదవులు కొఱికికొనుట |

## ఆ

| ధాతువు | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|
| ఆఁకొను | క్షుధితే | అ ఆఁకలిఁగొనుట |
| ఆఁగు | అనాశావస్థానే | అ నశింపక నిలుచుట |
| | అనాశావస్థాపనేచ | స నశింపకుండ నిలుపుట |
| ఆఁచు | అనాశావస్థాపనే | స నశింపకుండ నిలుపుట |
| ఆటు | కార్యరభసత్వమత్తాయాం | అ పనికిఁ దాఁటుట (ఈకత్తి యుద్ధమున కాఁటెను) |
| | పర్యాప్తౌచ | చాలుట (ఈయన్నమంద అకు నాఁటెను) |
| ఆడు | నృత్తే | అ నృత్తము చేయుట |
| | భాషణాదౌచ | స మాటాడుట, మాట చెప్పుట, స్నానమాడుట, స్నానము సేయుట |
| ఆను | పానే | స త్రాగుట |
| | ఉపధానేచ | చేరుకొనుట |
| ఆనుకొను | ఉపధానే | స చేరుకొనుట |
| ఆదమఱు | జ్ఞప్తిభ్రంశే | అ జ్ఞప్తిదప్పుట |
| ఆఁపు | అనాశావస్థాపనే | స నశింపకుండ నిలుపుట |
| ఆపోవు | తృప్తౌ | అ తృప్తియౌట |
| ఆమతించు<br>ఆమెతించు | సత్కృత్యాహ్వానే | స సత్కారపూర్వకముగాఁ బిలుచుట |
| ఆరగించు | భోజనే | స భుజియించుట |
| ఆరయు | పరిశీలనే | స పరిశీలించుట |
| | ఆర్తివారణేచ | ఆర్తివారించుట |
| ఆరాయు | పరిశీలనే | స పరిశీలించుట |
| ఆరు | పూర్తౌ | అ నిండుట |
| ఆరితేఱు | సమర్థీభవనే | అ సమర్థుండౌట |
| ఆఱు | నిర్జలీభావే | అ నిర్జలమౌట, ఎండిపోవుట |
| | ఉష్మశాంతౌ | వేఁడిశమించినదౌట |
| | దీపాదీనాం నాశేచ | దీపాదులు నశించుట |

# ఆ

| ధాతువు | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
| --- | --- | --- |
| ఆఁకొను | క్షుధితే | అ ఆఁకలిగొనుట |
| ఆఁగు | అనాశావస్థానే | అ నశింపక నిలుచుట |
| | అనాశావస్థాపనేచ | స నశింపకుండ నిలుపుట |
| ఆఁచు | అనాశావస్థాపనే | స నశింపకుండ నిలుపుట |
| ఆటు | కార్యరభసప్రమత్తాయాం | అ పనికిఁబాఁకుట (ఉకత్తి యుద్ధమున కాఁకెను) |
| | పర్యాప్తౌచ | చాలుట (ఈయన్నము నాకు నాఁటెను) |
| ఆడు | నృత్తే | అ నృత్తము చేయుట |
| | భాషణాదౌచ | స మాటలాడుట, మాట చెప్పుట, తానమాడుట, తానము సేయుట |
| ఆను | పానే | స త్రాగుట |
| | ఉపధానేచ | చేరుకొనుట |
| ఆనుకొను | ఉపధానే | స చేరుకొనుట |
| ఆదమఱి | జ్ఞప్తిభ్రంశే | అ జ్ఞప్తిదప్పుట |
| ఆఁపు | అనాశావస్థాపనే | స నశింపకుండ నిలుపుట |
| ఆపోవు | తృప్తౌ | అ తృప్తియౌట |
| ఆమతించు<br>ఆమెతించు | సత్కృత్యాహ్వానే | స సత్కారపూర్వకముగాఁ బిలుచుట |
| ఆరగించు | భోజనే | స భుజియించుట |
| ఆరయు | పరిశీలనే | స పరిశీలించుట |
| | ఆర్తివారణేచ | ఆర్తివారించుట |
| ఆరాయు | పరిశీలనే | స పరిశీలించుట |
| ఆరు | పూర్తౌ | అ నిండుట |
| ఆరితేఱు | సమర్థీభవనే | అ సమర్థుండౌట |
| ఆఱు | నిర్జలీభావే | అ నిర్జలమౌట, ఎండిపోవుట |
| | ఉష్ణశాంతౌ | వేఁడిశమించినదౌట |
| | దీపాదీనాం నాశేచ | దీపాదులు నశించుట |

| ధాతువు | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|
| అఱ్చు, అఱచు | ఉద్ఘోషే | అ ఉద్ఘోషించుట |
| అఱువు | గ్రహణాదిశక్యతాయాం, లభ్యతాయాంచ | అ పట్టుకొనుటకు శక్యమవుట, చేతికి అవుట, దక్కుట |
| అఱువుకొను | ప్రాప్తస్యజీర్ణకరణే | స ప్రాప్తమైనదానిని జీర్ణము చేసికొనుట |
| అఱుము | ఆక్రమణే | స ఆక్రమించుట |
| అలుకు | గోమయాదిలేపనే | స పేఁడ మొదలగువానిచే లేపనము సేయుట |
| అలుగు | రోషే | అ రోషముపొందుట |
| అలంచు | పీడనే | స పీడించుట |
| అలందు | చర్చనే | స గంధము మొదలైనవి పూసికొనుట |
| అలంమురు | దుఃఖే | అ దుఃఖపడుట |
| అలము | వ్యాప్తౌ | స వ్యాపించుట |
| అలయు, అలియు | శ్రాంతౌ | అ శ్రాంతుఁడగుట |
| అలరు | వికాసే, సంతోషేచ | అ వికసించుట–సంతోషించుట |
| అలవడు | అభ్యస్తౌ | అ అలవాటుపడుట |
| అల్లాడు, అల్లల్లాడు, అల్లనాడు | అనవలంబస్పందే | అ అవలంబనము లేక కదలుట |
| అల్కు | భయే | అ భయపడుట |
| అల్లు, అళ్లు | అన్యోన్యగ్రథనేన నిర్మాణే | స అల్లికగానిర్మించుట, చాప యల్లెను |
| | లతాదిప్రసరణేచ | అ తీఁగ మొదలైనది ప్రసరించుట |
| అవు | భవనే | అ అవుట |
| అవియు, అవిసియు | రూపపరామర్శే | అ రూపుచెడిపోవుట |
| అవుడుగఱచు | కోపేనోష్ఠదంశనే | అ కోపముచేతఁ బెదవులు కొఱికికొనుట |

## ఆ

| ధాతువు | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
| --- | --- | --- |
| ఆఁకొను | క్షుధితే | అ ఆఁకలిగొనుట |
| ఆఁగు | అనాశావస్థానే | అ నశింపక నిలుచుట |
| | అనాశావస్థాపనేచ | స నశింపకుండ నిలుపుట |
| ఆఁచు | అనాశావస్థాపనే | స నశింపకుండ నిలుపుట |
| ఆఁటు | కార్యారంభసక్షమతాయాం | అ పనికిఁజాలుట (ఈకత్తి యుద్ధమున కాఁటెను) |
| | పర్యాప్తౌచ | చాలుట (ఈయన్నమందఱకు నాఁటెను) |
| ఆడు | కృత్తౌ | అ కృత్యము చేయుట |
| | భాషణాదౌచ | స మాటాడుట, మాటచెప్పుట, తాసమాడుట, తాసము సేయుట |
| ఆను | పానే | స త్రాగుట |
| | ఉపధానేచ | చేరఁగొనుట |
| ఆనుకొను | ఉపధానే | స చేరుకొనుట |
| ఆదమఱు | జ్ఞప్తిభ్రంశే | అ జ్ఞప్తిదప్పుట |
| ఆఁపు | అనాశావస్థాపనే | స నశింపకుండ నిలుపుట |
| ఆపోవు | తృప్తౌ | అ తృప్తియగుట |
| ఆమతించు<br>ఆమెతించు | సత్కృత్యాహ్వానే | స సత్కారపూర్వకముగాఁ బిలుచుట |
| ఆరగించు | భోజనే | స భుజియించుట |
| ఆరయు | పరిశీలనే | స పరిశీలించుట |
| | ఆర్తివారణేచ | ఆర్తివారించుట |
| ఆరాయు | పరిశీలనే | స పరిశీలించుట |
| ఆరు | పూర్తౌ | అ నిండుట |
| ఆరితేఱు | సమగ్రీభవనే | అ సమగ్రుండౌట |
| ఆఱు | నిర్జలీభావే | అ నిర్జలమౌట, ఎండిపోవుట |
| | ఊష్మశాంతౌ | వేఁడిశమించినదౌట |
| | దీపాదీనాం నాశేచ | దీపాదులు నశించుట |

| ధాతువు | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|
| ఆఱ్చు | ఉద్ఘోషే<br>దీపాదినిర్వాపణేచ | స ఉద్ఘోషించుట<br>దీపాదులు చల్లార్చుట |
| ఆఱ్పు | దీపాదినిర్వాపణే | స దీపాదులు చల్లార్చుట |
| ఆలకించు<br>ఆలించు | సావధానశ్రవణే | స సావధానముగా వినుట |
| ఆవులించు<br>ఆవలించు | జృంభణే | అ ఆవులింత విడుచుట |
| ఆవటిల్లు<br>ఆవటించు | భూతాదీనా మావేశే | అ భూతాదులావహించుట |

ఇ

| ధాతువు | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|
| ఇంకు | నిర్జలీభావే | అ నిర్జలమగుట |
| ఇగ్గు | ఆకర్షణే | స ఈడ్చుట |
| ఇగ్గులాడు | అన్యోన్యాకర్షణే | అ అన్యోన్యమీడ్చికొనుట |
| ఇగురు | నిర్జలీభావే | అ నిర్జలమగుట |
| ఇగుర్చు | పల్లవోద్భేదే | అ చిగిరించుట |
| ఇగిలించు | దంతాగ్రప్రదర్శ్యావస్థానే, అశ్వఘోషేచ | అ పండ్లు తెఱచికొనియుండుట<br>గుఱ్ఱము శబ్దించుట |
| ఇచ్ | దానే | స దానముచేయుట |
| ఇచ్ఛగించు | సమ్మతౌ | స సమ్మతించుట |
| ఇడు | దానే, నిధానేచ | స ఇచ్చు, ఉంచు మొ॥ |
| ఇడియు | విశ్లేషే | అ విరియుట |
| ఇనుకు | నిర్జలీభావే | అ నిర్జలమౌట |
| ఇందు | | అ భక్షింపఁబడిన యన్నాదులు దక్కుట |
| ఇనుమడించు<br>ఇబ్బడించు<br>ఇమ్మడించు | ద్విగుణీభావే<br>ద్విగుణీకరణేచ | అ ద్విగుణమగుట<br>స ద్విగుణము సేయుట |
| ఇముడు | సంకుచితస్థలేపర్యాప్తావస్థానే | అ సంకుచితస్థలంబునఁ జాలియుండుట |

| ధాతువు | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|
| ఇమురు | జలశోషణే | అ జలము శోషించుట |
| ఇయ్యకొను | అంగీకారే | స అంగీకరించు |
| ఇరవొందు | శోభాయాం | అ శోభించుట |
| ఇఱియు | దృఢసంశ్లేషణే | అ కదియుట |
| | చూర్ణీభావేచ | చూర్ణమగుట |
| ఇటుకు | అంతరాసంకుచితావస్థానే | అ నడుమ సంకుచితముగా నుండుట |
| ఇలకటు | దంతదృఢబంధే | అ దంతములు గట్టిగా బిగఁబట్టుట |

## ఈ

| | | |
|---|---|---|
| ఈఁకు | నిర్జలీభావే | అ నిర్జలమగుట |
| ఈఁగు | వ్యపనాశనే | స పోఁగొట్టుట |
| ఈచుకపోవు, ఈచుకొనిపోవు | పశ్వాదిగర్భపాతే | అ ఆవులు మొదలైనవి గర్భపఘాతము నొందుట |
| ఈడు, ఈడ్చు | కర్షణే | స లాగుట |
| ఈడేరు | సాఫల్యే | అ సఫలమవుట |
| | ప్రథమరజఃప్రాదుర్భావేచ | కన్యరజస్వలయౌట |
| ఈడఁబోవు | పరాగతౌ | అ వెనుకదీయుట |
| ఈడగిలపడు | గంతుమశక్తౌ | అ నడువనశక్తుండౌట |
| ఈఁతకొట్టు, ఈఁదు, ఈఁదులాడు | బాహుప్లవనే | అ నీళ్లలో బాహువులచేతఁ దేలుట |
| ఈను | తిరశ్చాంప్రసవే | స ఆవుమొదలైనవి ప్రసవించుట |
| | సస్యఫలనిష్పత్తౌ | పైరు వెన్నువిడుచుట |
| ఈరు, ఈర్చు | కేశలిక్షాపసారణే | స తలవెంట్రుకలలో ఈళ్లు పోవునట్లు చేయుట |
| ఈలుఁగు | మృతౌ | అ చచ్చుట |
| ఈలకటు | దంతదృఢబంధే | అ దంతములు గట్టిగా బిగఁబట్టుట |

## ఉ

| ధాతువు | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|
| ఊంకించు | ఉద్యమే | అ ఉద్యుక్తుఁడౌట |
| ఉగ్గడించు<br>ఉగ్గళించు | అతివాదే<br>వాదారంభేచ | అ మిక్కిలి వాదించుట<br>వాదమునకారంభించుట |
| ఉచ్ | అంతఃప్రవేశే | స లోపలికిఁ దూఱుట |
| ఊచు | నిధానే | స పెట్టుట |
| ఉజ్జగించు | త్యాగే | స త్యజియించుట |
| ఉటంకించు | సారాంశగ్రహణే | స సారాంశగ్రహణము సేయు |
| ఉటకాడించు<br>ఉడకాడించు<br>ఉడుకాడించు | ప్రహాసాయబాధనే | స నవ్వులాటకై యొకని బాధ పెట్టుట |
| ఉడాయించు | క్షణమాత్రేణాపహరణే | స క్షణమాత్రములో నపహరించుట(ప్రాకృతతద్భవము) |
| ఉండు | నివాసే | అ నివసించుట |
| ఉడుకు<br>ఉడికిలు | క్వాథే<br>పరిహాసజే రోషేచ | అ పక్వమవుట<br>అపహాసముచేత రోషయుక్తుఁడౌట |
| ఉడుగు | కార్యవిరమణే<br>కార్శ్యేచ | స పనిచాలించుట<br>కృశించుట |
| ఉడ్డుగుడు | శ్వాసపారవశ్యే | అ ఊపిరి త్రిప్పుకో లేక పోవుట |
| ఉడిపోవు | నిస్సారీభవనే | అ నిస్సారమౌట |
| ఉతుకు, ఉదుకు | వస్త్రాదిక్షాళనే | స వస్త్రాదులు క్షాళనము సేయుట |
| ఉదిరిపడు | ఆకస్మికవల్గనే | అ ఉలికిపడుట |
| ఉదిలపడు<br>ఉదిలగొను | చింతాయాం | అ చింతనొందుట |
| ఉనుచు | నిధానే | స పెట్టుట |
| ఉప్పు | పిష్టవ్రీహ్యాదిక్వథనే | స పిండి, వడ్లు మొదలైనవి ఉడుకఁబెట్టుట |

